# బాల వ్యాకరణం

## సంజ్ఞా పరిచ్ఛేదం

### ద్రుత ప్రకృతికములు - కళలు

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# ద్రుతం - నిర్వచనం

11. న కారంబు ద్రుతంబు

---

'ద్రుతమనగా నొల్లని యెడ మఱిగిపోవునది'. – ప్రౌ.వ్యా.

' ద్రుతాఖ్యో నః' – ఆం.శ.చింతామణి

నకారం బసాధారణంబు ద్రుతంబు.( ప్రౌఢ. సంజ్ఞా 7)

# ద్రుతం - స్వరూపం

- ద్రుతం మూడు రూపాల్లో ఉంటుంది.
  1. ని - (< ఇకారం మీద. హరిని, కరిని)
  2. న్ – ( హల్లుగాని, అవసానం కాని పరమైనప్పుడు. పూచెన్ గలువలు, వచ్చెన్, జోయెన్ ..)
  3. ను – ( స్వత్వమందు / ప్రకృతిభావమందు. పూచెను గలువలు)
- ఇది మూడువిధాలుగా కనపడుతుంది
  1. ప్రత్యయాత్మకం – ( తాను, నేను, ధనమును, చదువుచున్నాను, చదువగలను..)
  2. ఆగమాత్మకం - ( నన్నును, నాచేతను, చదువుచును..)
  3. అవ్యయాత్మకం - ( అన్నయును, తమ్ముడును )

# ద్రుతప్రకృతికం - నిర్వచనం

12. ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు.

1)ప్రథమా కయి పట్టి యొక్కేతరము లయినవిభక్తులు,
2)ఉత్తమ పురుషైక వచనంబులు,
3)భూత తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు,
4)ఆశీరాద్యర్థంబు లయిన యెడు,తవర్ణకంబులు,
5) శతృతుమానంతర్య చే దాద్యర్థకంబులు,
6)నేను తాను పదంబులును, 7)వలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు.

# ద్రుతప్రకృతికం - ఉదాహరణలు

ప్రథమా కయి పట్టి యొక్కేతరము లయినవిభక్తులు :-
నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ -
నాకున్ - మాలోపలన్ - మాయందున్,

భూత తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు

వత్తున్ - వచ్చెదన్. వచ్చెన్ - వచ్చున్ - వచ్చెడున్. ప్రసన్ను లయ్యెడున్,
కావ్రుతన్. కొట్టుచున్, కొట్టన్, కొట్టఁగన్, కొట్టుడున్, కొట్టినన్.
వలెన్ - ఎంతయున్ - అయ్యున్ - పోలెన్. ఇత్యాదు లూహ్యంబులు.

# ద్రుతప్రకృతికం – ప్రవర్తన

ద్రుతప్రకృతికం

- సుబంతాల్లో
- తిఙంతాల్లో
- అవ్యయాల్లో
- తాను, నేను

# ద్రుతప్రకృతికం – సుబంతాల్లో

- 1 ప్రథమా, 4 కయి , 5 పట్టి, 6 యొక్కె తరము లయిన విభక్తులు :-

★ ద్వి. - నన్నున్ –

✓ తృ. - నాచేతన్ - నాతోడన్

✓ చ. – నాకొఱకున్

✓ పం.- నావలనన్ - నాకంటెన్ –

✓ ష. - నాకున్ - మాలోపలన్

✓ స. - మాయందున్,

# ధ్రుతప్రకృతికం - తిఙన్తాల్లో

- క్రియారూపాల్లో
- ✓ ఉత్తమపురుషైకవచనం - వత్తున్ - వచ్చెదన్.
- ✓ భూత – వచ్చెన్
- ✓ తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనంబులు - - వచ్చున్ - వచ్చెడున్.
- ✓ ఎడు వర్ణకాంత ఆశీరాద్యర్థకములు - ప్రసన్ను లయ్యెడున్, కావుతన్.

# ధృతప్రకృతికం - అవ్యయార్థాల్లో

- ✓ శత్రర్థకం - కొట్టుచున్,
- ✓ తుమున్నర్థకం - కొట్టన్, కొట్టఁగన్,
- ✓ ఆనంతర్యార్థకం - కొట్టుడున్,
- ✓ చేదాద్యర్థకం – కొట్టినన్.
- ✓ వలె ప్రభృతులు - వలెన్ - ఎంతయున్ - అయ్యున్ – పోలెన్

➢ ప్రథమ విభక్త్యేకవచనం –

- ✓ తామున్, నేమున్ ఇత్యాదు లూహ్యంబులు.

# కళలు

13. ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళ లనంబడు.

- ✓ రాముఁడు – రాములు హయము – విష్ణువు – గోడ – మేడ – అయ్య – అమ్మ.
- ✓ రామునికయి. జ్ఞానముఁబట్టి. నాయొక్క.
- ✓ వచ్చిరి – వచ్చితివి వచ్చితిరి – వచ్చితిమి. రాఁడు – రారు – రాదు – రావు – రాము. కొట్టక – తిట్టక. ఎత్తిలి ఒత్తిలి
- ✓ ఊరక – మిన్నక – బళి – అక్కట – ఏల. ఇత్యాదు లూహించునది.

